పై క్రమంలోనే భారత కమ్యూనిస్టు విప్లవ అగ్రనేతలు కామ్రేడ్స్ దేవులపల్లి వెంకటేశ్వరరావు, తరిమెల నాగిరెడ్డిగార్లు రూపొందించిన విప్లవ ప్రజాపంథాను, వారి రచనలను పుప్పులూరి అత్యంత శ్రద్ధతో అధ్యయనం చేసారు. భారత ప్రజల ప్రజాతంత్ర విప్లవ కార్యక్రమం, ఎత్తుగడల పంథా, దళారీ, జాతీయ బూర్జువా వర్గాలు, జాతుల స్వయం నిర్ణయాధికారం, కార్మికవర్గ నాయకత్వ సమస్య ఇలా అనేక సమస్యలపై దేవులపల్లి శాస్త్రీయమైన వివరణను ఇచ్చారని గ్రహించారు. వారు స్థాపించిన విప్లవ సంస్థ యు.సి.సి.ఆర్.ఐ.ఎం.ఎల్.తో 1992 నుండి 1998లో చివరిశ్వాస తీసే వరకూ సన్నిహిత సంబంధాలను నెరిపారు. ఈ సంస్థలో కలిసి పనిచేసి వారి కార్మికులలో విప్లవ రాజకీయ చైతన్య అభివృద్ధికి అనారోగ్యాన్ని సైతం లెక్క చేయకుండా అహరహం కృషి చేసారు. కామ్రేడ్ పుప్పులూరి సుబ్బారావు జీవితం, ఆలోచనలు, దీక్షల ఆదర్శంతో దేశంలో కార్మికుల, వివిధ జాతుల విముక్తి, ఉద్యమాలను నిర్మించడమే ఆయనకు నివాళి.

*(శ్రీ. సి. హెచ్.ఎస్.ఎన్.మూర్తి గారు రాసిన ఈ వ్యాసం అంతర్జాలం నుండి తీసుకోవడమైనది)*

* * * *



# అనుబంధాలు

# సమసమాజమే సోమసుందర్ స్వప్నం!

(డా॥ ఆవంత్స సోమసుందర్ 6వ వర్ధంతి సందర్భంగా 12-08-2022 శుక్రవారం సాయంత్రం కాకినాడ జిల్లా పిఠాపురంలోని శ్రీ సూర్యారాయ విద్యానంద గ్రంథాలయంలో జరిగిన సభలో నా ప్రసంగ పాఠం సంక్షిప్తంగా)

సరిగ్గా ఇరవై ఏళ్ళ క్రితం నేను హైస్కూలు విద్యార్థిగా ఉండగా అక్కడ వివేకానందుడి జయంతి రోజున మొదటిసారి సో.సు.గారి ప్రసంగం విన్నాను. ఆ కార్యక్రమం ఏర్పాటు చేసింది కూడా సహృదయ మిత్ర మండలే. అలాగే ఈనాటి సమావేశానికి సంకల్పం చేసింది కూడా సహృదయమిత్రమండలే. కాన నాకు సో.సు.గారికి అనుసంధానంగా ఉన్న మిత్ర మండలికి ముందుగా నా కృతజ్ఞతలు. వేదికపైనున్న పెద్దలకీ, సభలోని పెద్దలకి నమస్సులు!

ఈ రోజు మూడు చారిత్రక విశిష్టతల రీత్యా ఈ సమావేశం ప్రాధాన్యతను సంతరించుకుంది. మొదటిగా సరిగ్గా వందేళ్ళ క్రితం 1922లో పిఠాపురం రాజావారికి మహరాజా బిరుదు ప్రధానం చేయబడింది. ఆ సందర్భంగా జరిగిన సభలో చెలికాని లచ్చారావు గారు "దుష్ట మంత్రాంగం" నుండి జాగరూకులై వుండాలని ప్రభువులని హెచ్చరించగా కోపంతో రాజావారు దుష్టమంత్రాంగం అని ఎవరిని ఉద్దేశించి అన్నారో ఆ దివాన్ గారి ఉద్యోగం శాశ్వతం చేస్తున్నట్లు ప్రకటించి లచ్చారావు గారికి కోటలోకి ప్రవేశాన్ని నిషేధించారు. ఈ రోజు అంతకు మించిన దుష్టమంత్రాంగాలు సమాజం అంతటా ఉన్నాయి!

ఇక రెండు 1922లోనే ఆంధ్రా షేక్స్పియర్ పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి అధ్యక్షతన పిఠాపురంలో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు సమావేశం. అందులో ఆయన చేసిన అద్భుతమైన ప్రసంగం. మూడోదీ, ముఖ్యమైనది ఈ మన గ్రంథాలయానికి సంబంధించిన విశిష్టమైన విషయం ఏమిటంటే, 1915లో విద్యానంద గ్రంథాలయం ఏర్పడింది. తర్వాత సూర్యారాయ గ్రంథాలయం ఏర్పడింది. ఈ రెండు గ్రంథాలయాలు సంయుక్తంగా ఒకే గ్రంథాలయంగా ఏర్పడి శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంగా రూపాంతరం చెందడం 1922లోనే జరిగింది. కాన ఈ లైబ్రరీకి సిసలైన శతవార్షికోత్సవ సందర్భం ఇదే!



ఈ క్రమంలో సరిగ్గా 1933వ సంవత్సరం మాధవస్వామి గుడి ఎదురుగా ఉన్న ఖాళీ స్థలంలో కొద్దిమంది పిల్లలు క్రికెట్ ఆడుతున్నారు. బంతి దగ్గర్లోని తాసీల్దార్ గారి ఇంట్లోకి వెళ్ళి పడింది. తేవడానికి వారింటికి వెళ్ళిన అబ్బాయితో మీ అమ్మగార్నడిగి పులిహోర చేయించమన్న ఆ తాసీల్దారు గారు తరువాత పట్టణంలో జరిగిన ప్రముఖ నాటకోత్సవాలు అన్నింటికీ ఆ అబ్బాయిని ఆప్యాయంగా తమ కుటుంబంతో పాటు తీసుకుని వెళ్ళేవారు. అలా చిన్నతనంలోనే ఒక గొప్ప సాంస్కృతిక స్థాయి కళాభిరుచి ఏర్పడటానికి అరమరికలు లేని ఆ స్నేహం నిదర్శనంగా నిలిచింది. ఆ అబ్బాయి పేరు ఆవంత్స సోమసుందర్ కాగా ఆనాటి తహసీల్దారు లాల్ అహమద్ గారు. ఒక మనిషి మహాకవిగా రూపొందే క్రమంలో మతసామరస్యత పోషించిన పాత్రని ఈరోజు గుర్తించడం అవసరం!

ఇక 1944లో కోల్కత్తాలో జరిగిన స్టూడెంట్ ఫెడరేషన్ సభలకి వెళ్ళినప్పుడు అక్కడ హౌరా బ్రిడ్జి పై జీవచ్ఛవంగా పడున్న ఒక దీనుడ్ని చూసి అప్పటిదాకా భావ కవిత్వంలో కొట్టుమిట్టాడుతున్న సో.సు. ఒక్కసారిగా తనలో నుండి ఉప్పొంగిన భావాలను అక్షరాలుగా మలిచారు. అదే 'మౌనఘోష'నే కవితగా వ్యక్తమైంది. అంతేకాదు వజ్రాయుధంలోని ఇతర కవితలన్నింటికీ కూడా ఆసక్తికరమైన నేపథ్యాలు ఉన్నాయి. ఆస్తుల పంపకాలప్పుడు శంఖవరంలో ఉన్న ఆయన What is Philosophy పుస్తకం చదువుతూ అందులో జర్మన్ తత్వవేత్త హెయినే రాసిన ఒక వాక్యంతో ప్రభావితం అయ్యి రాసిన అద్భుతమైన కవితే 'ఖరార్నామా' మనిషికి ఉన్నదొక్క జీవితమే అని నినదిస్తుందా కవిత. కవిత్వంలో మొదటిసారి వర్గ దృక్పథాన్ని స్పష్టంగా చెప్పినవారైన. అందుకే "రెండు ప్రపంచాల మధ్య రెండు స్వభావాల మధ్య, రెండు వర్గాల మధ్య సాగుతున్న సంఘర్షణ" అంటారు. కమ్యూనిస్టు మ్యానిఫెస్టోకి కనుక కవితా రూపం ఇస్తే బహుశా అది వజ్రాయుధంలానే ఉంటుందేమో. గతంలో వజ్రాయుధానికి వజ్రోత్సవం పేరిట వ్యాసం రాసాను. త్వరలోనే వజ్రాయుధానికి వజ్రోత్సవ వేడుకలు నిర్వహించుకోగలమని ఆశిస్తున్నాను. నిజానికి వజ్రాయుధం వరకే సో.సు.ని పరిమితం చేయడం అపారమైన ఆయన పాండిత్యానికి అన్యాయం చేయడమే అనిపిస్తుంది. ఎందుకంటే ఆయన వంద గ్రంథాల్ని వివిధ ప్రక్రియల్లో రాసినవాడు, అద్వితీయ కవి, రచయిత, విమర్శకుడు, అనువాదకుడు, కళావేత్త, తాత్వికుడు, స్వాప్నికుడు ఇంకా ఎన్నో. కమ్యూనిస్టు రాజ్యాలు కూలిపోయినప్పుడు,

పార్టీలో చీలికలు వచ్చినప్పుడు "సీకింగ్ మై బ్రోకెన్ వింగ్స్" (Seeking my Broken Wings) అంటూ హృద్యంగా దానిని వ్యక్తం చేసారు. నాకు తెలిసీ ప్రపంచ సాహిత్యంలో అంత చక్కగా ఆ ఘటనని వర్ణించిన కవి మరే దేశంలోనూ ఏ భాషలోనూ లేరు. ఆ కవితా శీర్షిక కోసం ఆయన్ని, అంటే మీరు కమ్యూనిజాన్ని రెక్కలూడిపోయిన పక్షితో పోల్చారా? అనడిగిన ప్రశ్నకు ఆయన కాదు ఎప్పటికైనా పునరుజ్జీవనంతో రెక్కలు కట్టుకు ఎత్తుకేగే పక్షితో పోల్చానంటారు. అందుకు జీవితంలో తనని నడిపించినవి రెండు ఒకటి కవిత్వం మరోటి కమ్యూనిజం అని చివరి నిముషాన కూడా ప్రకటించాడాయన!

వ్యక్తిగతంగా ఆయనతో ఉన్న అనుబంధాన్ని వర్ణించాలంటే సమయం చాలదు. పదేళ్ళకిపైబడిన అనుబంధం ఆయనతో నాది. వజ్రాయుధం పంచమ ప్రచురణకి సిగార్‌తో ఉన్న ఆయన ఫొటోను ఎంపిక చేసింది నేనే. అప్పటికే అనేక ఏళ్ళుగా ముద్రణకు నోచుకోని వజ్రాయుధాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ బ్రాంచిలు అన్నింటికీ పోస్టుకార్డులు రాయడం ద్వారా ప్రచురణయ్యేలా ప్రయత్నం చేసింది నేనే. తాను అపురూపంగా దాచుకున్న శ్రీశ్రీ ఆటోగ్రాఫ్ నాకు ఇవ్వడం మొదలు ఎన్నో జ్ఞాపకాల వెల్లువని ఇలా ఒక సమావేశంలో వ్యక్తం చేయడం సులభం కాదు. జార్జి థాంప్సన్ మార్క్సిజం – కవిత్వం మొదలు క్రిస్టోఫర్ కాడ్వెల్ ఇల్యూజన్ – రియాలిటీ (భ్రాంతి – వాస్తవికత) దాకా బెర్ట్రోల్ట్ బ్రెష్ట్ అమ్మ మొదలుకొని షెల్లీ ఏరియల్ వరకూ ఎన్నో అమూల్యమైన గ్రంథాలను తెలుగు చేసారు. సాహిత్య విమర్శని సో.సు. లాగా అధ్యయనం చేసిన వారనే మాటటుంచి ఆ దరిదాపుల్లోకి రాగలవారు కూడా ఈనాటికీ లేరు. పరిశోధన విషయంలోనూ అంతే. గురజాడ కన్యాశుల్కంలోని పూర్రిచర్డ్ పదం ఆదుపాదులు తేల్చడం మొదలు, గోదావరి జలప్రళయ రక్షకుడుగా పేరొందిన వెంకటరెడ్డి జోగయ్యల్ని వెలుగులోకి తీసుకురావడం వరకూ ఎంతో గొప్ప లోతైన శోధన ఆయనది. వందకి పైబడి పుస్తకాలు రాసి ప్రచురించినా ఎన్నడూ ఏ పత్రిక్కీ పంపింది లేదు. తానుగా పేరు కోసం పాకులాడిందీ లేదు. జ్ఞాన్‌పీఠ్ ఆయనకి రాకపోవడం ఆ అవార్డుకి అగౌరవం అని నా అభిప్రాయం!

గోర్కీ స్వీయచరిత్ర మూడు భాగాల నుండి ప్రేరణ పొందిన సో.సు. తాను కూడా మూడు భాగాలుగా ఆత్మకథ రాయాలని అనుకున్నారు. కానీ రెండు భాగాలే



రాయగలిగారు. అందులో కూడా మొదటి భాగం 'కలలు–కన్నీళ్ళు' చాలా హృద్యంగా మలిచి న్యాయం చేసారు. తెలుగు సాహిత్యంలో ఒక కవి స్వీయచరిత్ర. రాసి మెప్పించడం అరుదు. దానిని సుసాధ్యం చేసారు సో.సు. అందరూ తప్పకుండా చదవాల్సిన స్వీయచరిత్ర అది రెండో భాగానికి అనారోగ్య కారణాల వల్ల న్యాయం చేయలేకపోయారు. తొంభై ఏళ్ళ జీవితంలో ఎక్కువ కాలం సాహిత్యానికే అంకితం చేసిన మహోన్నత వ్యక్తి సో.సు. ఆయన కేవలం కవి మాత్రమే అనుకునే వాళ్ళకి ఒక విషయం గుర్తు చేయాలి. ఈ ప్రాంతంలో మొట్టమొదటి పారిశుధ్య కార్మికుల ఉద్యమానికి నేతృత్వం వహించిందీ రైతు ఉద్యమాల్లో పాలు పంచుకోవడం మొదలు భావాల కారణంగా సొంత పాలకుల చేతనే జైల్లో పెట్టబడి కారాగార జీవితం గడిపి కేసులను ఎదుర్కొన్నదీ సో.సు. గారనేది గుర్తుంచుకోవాలి!

కళాకేళి పత్రికని స్థాపించడం మొదలు కళాకేళి నికేతన్ సంస్థ ద్వారా ఆరుద్ర త్వమేవాహం మొదలు ఎన్నో గ్రంథాలు ముద్రించడం తన సమకాలీన కవి, రచయితలందరి సాహిత్యం మీదా సాధికారిక విమర్శ చేసి వాటిని పుస్తక రూపంలో ముద్రించడం, లిటరరీ ట్రస్ట్ స్థాపించి వర్తమాన, వర్ధమానకవులు, రచయితల్ని ప్రోత్సహించడం ఆయన నిర్వహించిన అసంఖ్యాక పాత్రల్లో కొన్ని మాత్రమే. సూటిగా స్పష్టంగా జీవించిన ఆయన ఎప్పుడూ రాజీ ధోరణిని అవలంభించింది లేదు. తెలంగాణ పోరాట కాలంలో వేలాది మంది ప్రజలు పాల్గొన్న ప్రతి సమావేశంలోనూ వజ్రాయుధ గేయాల్ని ఎలుగెత్తి పాడుకునే సంప్రదాయం ఉండేది. అలాంటిది ఈ రోజు సొంత గడ్డ మీద సోమసుందర్ పేరు తెలిసిన వారు తక్కువ. 'శాస్త్రజ్ఞానం లేని ఉత్పత్తి విషంగా మారుతుంది' అంటారు సో.సు. భ్రాంతి–వాస్తవికతకి ముందుమాటగా శీర్షికలో అలాంటి విషాన్ని ఈ రోజు ప్రత్యక్షంగా మనం చూస్తున్నాం కావున ఈ స్తబ్దతని అధిగమించడం అవసరం!

వారసత్వం అనేది ఒక్కరిది కాదు, ముందుకొచ్చే ప్రతి ఒక్కరిదీ. లిటరరీ ట్రస్ట్ కార్యక్రమాల సంగతి అలా ఉంచితే కేవలం సో.సు. సాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి, తద్వారా ప్రజల్లోకి దానిని తీసుకుని వెళ్ళడానికి సోమసుందర్ స్టడీ సర్కిల్ లేదా ఫోరం వంటిది ఏదైనా ఏర్పాటు చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. మిత్రులు ఆలోచిస్తారని ఆశిస్తాను, చివరగా బతికున్నన్నాళ్ళూ ఎన్నో సార్లు తిట్టుకున్నాం,

మళ్ళీ కలుసుకున్నాం, బహుశా మా తాతయ్యతో కూడా నేను సో.సు.తో ఉన్నంత చనువుగా లేనేమో. ఆ అనుభవాలను అన్నింటినీ అదిలిస్తే ఇక ఆ ప్రవాహం ఆగదు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తన అనుభవాలు–జ్ఞాపకాల్లో అంటారు. 'సత్యం–శివం–సుందరం ఇంతే కవుల ధ్యేయం' అని సో.సు.గారి జీవితానికి సరిగ్గా అతికినట్లు సరిపోయే వాక్యమది. జీవితాంతం సత్యం కోసమే బతికి శివాన్ని అంటే అందరి బాగుని ఆశించి సుందరాన్ని జీవితంలోని సౌందర్యాన్ని పరిపూర్ణంగా ఆస్వాదించిన మహామనిషి సో.సు. ఆయనకిదే నా ఆత్మీయ నీరాజనం. సెలవు!

*(సకలం వెబ్ పత్రికలో ప్రచురించబడింది)*

* * * *



# ప్రాచీన భారతీయ చరిత్ర, సంస్కృతి, తాత్త్విక చింతన

**(డా॥ ఎమ్.బావనాచార్యులు పుస్తక పరిచయం)**



“మాడభూషి చనిపోవడానికి ముందు హైదరాబాదులో కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు గారి సారధ్యంలో ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తత్త్వశాస్త్రీయ పరిశీలన, గతితార్కిక,భౌతికవాద దృక్పథం పేరిట బహుశా 1992లో ఒక చర్చా గోష్టి జరిగింది. ఆనాటి ప్రముఖ మార్క్సిస్టు చరిత్ర కారులందరూ నాతో సహా ఆ రెండు రోజుల్లో జరిగిన గోష్టిలో పాల్గొన్నారు. కామ్రేడ్ ఏటుకూరి బలరామమూర్తి, డా॥ వకుళాభరణం రామకృష్ణ, కామ్రేడ్ గురువారెడ్డి మొదలగు మేధావులున్నారు. అందులో మాడభూషి భావనాచారి ఒకరు. ఆ చర్చాగోష్టి ప్రధాన ఉద్దేశం గురించి కామ్రేడ్ రాజేశ్వరరావు గారు ఏమి చెప్పారో వారి వారి మాటలలోనే చెబుతున్నాను. మన భారతదేశం చరిత్ర, సంస్కృతి, తత్త్వశాస్త్రాలను మార్క్సిస్టు దృక్కోణం నుండి పరిశోధన చేయండి. అది పార్టీకి చాలా అవసరం. ఈ విషయాన్ని మనం అశ్రద్ధ చేసాం. అందుకే మనం భారత ప్రజల మనస్తత్వాన్ని, ఆలోచనా విధానాన్ని అవగాహన చేసుకోలేకపోయాము!”

డా॥మాడభూషి భావనాచార్యులు రచన, ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తాత్త్విక చింతన గ్రంథానికి పరిచయం రాస్తూ ఆ పుస్తకం వెలువడానికి కారణాల్ని చెబుతూ స్వాతంత్ర్య సమరయోధులు, సీనియర్ కమ్యూనిస్టు, జర్నలిస్టు పరకాల పట్టాభి రామారావుగారు అన్న మాటలే పైనవి. భారతదేశంలో కులవ్యవస్థలు మొదలుకొని హిందూమతం విశ్లేషణ వరకూ మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ నుంచి మహాత్మాగాంధీ, వివేకానందల దాకా ప్రతీ అంశం గురించి విభిన్నమైన రీతిలో ఒక ప్రాథమిక పరిశోధన ఇందులో మనకు కనిపిస్తుంది. ముఖ్యంగా పురాణేతిహాసాల్లోని విషయాల్ని సరికొత్తగా సమాజానికి అన్వయించిన తీరు, దాంతో మనం విభేదించవచ్చు కానీ ఆ విషయ సేకరణకి అబ్బురపడక మానం. ఆ రకంగా ఇదో విలువైన పుస్తకం!

"కమ్యూనిజం భారతీయేతర సిద్ధాంతమనీ, భౌతికవాదంతో నిండి ఆస్తికతను నిరాకరిస్తుందనీ, కమ్యూనిస్టులు మాస్కో మానస పుత్రులనీ, వాళ్ళ వేళ్ళు (Roots) స్వదేశంలో లేవనీ – ఇలాగే ఎన్నో విమర్శలుండేవి. భారతీయ సంస్కృతినీ, అందులోని తాత్త్వికతనూ అవగాహన చేసుకోవడంలో విఫలమయ్యారన్నది ఆ విమర్శల్లో ముఖ్యమైనది. ఈ విమర్శలకు సమాధానంగా దేవిప్రసాద్ ఛటోపాధ్యాయ, దామోదర్ ధర్మానంద కొశాంబిలాంటి తత్త్వవేత్తలు, సామాజికశాస్త్రవేత్తలు, మార్క్సిస్టు సిద్ధాంతంలోని లోతుపాతులను సవివరంగా చర్చించారు. కమ్యూనిస్టు ఉద్యమం కూడా మేథోపరంగా ఎన్నో రచనలను ప్రోత్సహించి గ్రంథాలను ప్రచురించినా చేయాల్సిన కృషి ఇంకా వుందని సి.ఆర్.లాంటి నాయకులు అభిప్రాయపడుతుండేవారు. భారతీయ, తాత్త్వికతలోని సామాజికాంశాలనూ అభ్యుదయాంశాలనూ సులభంగా అర్థం చేసుకునే రీతిలో వేద, ఉపనిషత్ పురాణ, స్మృతి సాహిత్యాలనేగాక, అరవిందులు, వివేకానందుడు మొదలగువారి రచనలను విశ్లేషించి పార్టీ కేడర్లతో పాటు సామాన్య ప్రజానీకానికి అందించాలి. చరిత్ర సంస్కృతులతో పాటు వివిధ చారిత్రక విభాత సంధ్యలో జరిగిన ఆర్థిక సామాజిక మార్పులను విశ్లేషించాలన్నది సి.ఆర్.గారి సంకల్పం. సమావేశానంతరం సి.ఆర్.గారి ఆలోచనలకు స్పందించి రాసిన కమ్యూనిజం పత్రికలో ప్రచురించిన వ్యాసాల సంకలనం ఈ గ్రంథం!"

ప్రాచీన భారతీయ చరిత్ర, సంస్కృతి తత్త్వశాస్త్రాలకి సంబంధించి సరిగ్గా 30 ఏళ్ళ క్రితం మఖ్దుంభవన్లో జరిగిన ఒక చారిత్రక సమావేశాన్ని ప్రస్తావిస్తూ ప్రముఖ చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణగారు ఈ చిన్న పుస్తకానికి తిరుగులేని సాక్షీభూతంగా రాసిన ముందుమాటలోని ప్రారంభ వాక్యాలే పైనవి. ఆయా అంశాల్లో జరగాల్సిన లోతైన కృషిని ఈ రోజు మరింత అవసరంగా గుర్తించడం అన్ని అభ్యుదయ వామపక్ష ప్రగతిశీలశ్రేణుల తక్షణ కర్తవ్యమని నా అభిప్రాయం. ఆ రకంగా మొదట కమ్యూనిజం పత్రికలో వచ్చిన ఇందులోని వ్యాసాలతో పాటుగా పుస్తకంలో చేర్చిన రెండు అమూల్యమైన అనుబంధాలు కూడా ఉన్నాయి. మొదటిది ప్రస్తావించబడిన ఆ చారిత్రక సమావేశంలో పాల్గొన్న సభ్యుల క్రమ సంఖ్య పేర్లైతే, రెండోది ఈ దేశ మేధావులు విస్మరించిన తొలితరం మార్క్సిస్టు పరిశోధకుడు, కుల వ్యతిరేక ప్రతిఘటనోద్యమాల తొలి అధ్యయనవేత్త, మహామేధావి డా॥ కె.బి.కృష్ణ గారి "భగవద్గీతలో భౌతికవాద అంశాలు"కి సంబంధించిన సంక్షిప్త పరిచయం, సామాజిక ఉద్యమాలు ముఖ్యంగా భౌద్ధ, భౌతికవాద, కులనిర్మూలన ఉద్యమాలు పట్టించుకుని అధ్యయనం చేసి తీరవలసిన విలువైన చరిత్ర ఇదని నా అభిప్రాయం!



డా॥ మాడభూషి భావనాచార్యులు చిన్న వ్యక్తి కాదు. తొలితరం కమ్యూనిస్టు నాయకులు, ప్రజా పోరాటాలల్లో క్షేత్రస్థాయిలో పాలుపంచుకున్న వ్యక్తి. 1947లో ప్రభుత్వం ఈయన ఆచూకీ తెలిపితే పదివేలు బహుమతి ప్రకటించింది. నాగులాపల్లనే చిన్న గ్రామంలో ఉన్న మాడభూషిని పట్టుకునేందుకు ఏకంగా నాలుగు పెద్ద లారీలతో పోలీసులు రావాల్సి వచ్చిందంటే కమ్యూనిస్టుగా ఈయన స్థైర్యం ఏపాటితో అర్థం అవుతుంది. దేశంలోని వివిధ జైళ్ళల్లో రాజకీయ ఖైదీగా ఉన్న మాడభూషి తదనంతరం పార్టీతో విభేదించారు. "నాకు మార్క్సిజంలో అచంచల విశ్వాసం ఉంది. మన దేశానికి కమ్యూనిజం వచ్చి తీరుతుంది. అయితే దానిని మన భారతదేశ విశిష్ట తాత్త్విక చింతనకు జోడించాలి" అన్న ఉద్దేశంతో వేదాలు మొదలుకొని ఉపనిషత్తుల వరకూ లోతుగా అధ్యయనం చేసి, భారతీయ తత్త్వశాస్త్రాలపై డిప్లమో పొందారు. ప్రజలతో సంబంధం లేకుండా కేవలం అధ్యయనం చాలదనే ఉద్దేశంతో చెరకు రైతుల సమస్యలపై మూడు దశాబ్దాల పైబడి పోరాటాలు చేశారు. గోదావరి జిల్లా పీడిత జన పోరాటాలని ముందుండి నడిపించారు. అందుకే "పిఠాపురంలో కవి పండిత కుటుంబీకులనందరినీ కమ్యూనిస్టు పార్టీ ఆకర్షించింది" అన్న మాడభూషి "నేను కమ్యూనిస్టుగానే పుట్టాను, కమ్యూనిస్టుగానే జీవించాను, కమ్యూనిస్టుగానే మరణిస్తాను" అని ప్రకటించి ఇరవై ఏళ్ళ క్రితం 2002లో మరణించారు. 2011లో ఈ పుస్తకంగా ప్రచురించబడి విశిష్టమైన ఆయన శోధనను గుర్తించి ఆ మేరకు గౌరవించడం ఈ రోజు మతోన్మాదం పెచ్చరిల్లుతున్న వేళ మరింత అవసరమనే భావనే ఈ వ్యాసానికి ప్రేరణ!

(ఎన్నో భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ భారతీయ చరిత్ర, సంస్కృతి తత్త్వశాస్త్రాలకి సంబంధించిన పరిశోధనాత్మక చింతన గురించి సీరియస్‌గా కృషి చేసే ఆలోచనాపరులు, బుద్ధిజీవులు విస్మరించరాని విలువైన సంవేదనాత్మక గ్రంథం ఇది. ఆయా అంశాల్లో లోతైన కృషి మరింత జరగాల్సిన అవసరం ఎప్పటికంటే ఈ రోజు ఎక్కువ ఉందనేది నా అభిప్రాయం. ఆ రకంగా ఎప్పటి నుంచో పరిచయం చేయాలని అనుకున్న ఈ పుస్తకం గురించి ఇప్పటికిలా ఈ చిన్న రైటప్)

*(సకలం వెబ్ పత్రికలో ప్రచురించబడింది)*

* * * *

# పిఠాపురం నవయుగానికి నాలుగు స్తంభాలు

పిఠాపురం నవయుగానికి నాలుగు స్తంభాలు చెలికాని భావనరావు, మాడభూషి భావనాచార్యులు గారు, ఆవంత్స సోమసుందర్‌గారు మరియు ఉప్పులూరి సుబ్బారావు గారు. ఈ నలుగురు పిఠాపురం పట్టణంలోనే కాదు తెలుగు రాష్ట్రంలో నవయుగానికి నాంది పలికినవారు. వీరు మన పిఠాపురంలో పుట్టి జీవించటం నిజంగా గర్వకారణం. నలుగురూ కూడా అభ్యుదయ ఆలోచనలతో సామాన్యుని అభ్యున్నతి కోరినవారే.

మొదటగా చెలికాని భావనరావు గారు వీరు చిత్రాడ గ్రామంలో చెలికాని సూర్యారావు దంపతులకు జన్మించారు. భావనరావు గారు మానవతామూర్తి. వారు చిన్నతనము నుండీ అనేక ఉద్యమాలలో పాల్గొని సామాజిక సేవ చేసిన వ్యక్తి. 1930-31 సం॥లో ఉప్పు సత్యాగ్రహంలో హరిజనోద్యమంలో మరియు జాతీయోద్యమములో పాల్గొన్నారు. గాంధీ గారికి వ్యక్తిగా స్వచ్ఛంద సేవకుడిగా ఎన్నికై విశాఖపట్నం నుంచి ఆయనను అనుసరించి సేవ చేసిన వ్యక్తి భావనరావు గారు.

నవ్యకళాసమితి అనే ఒక సంస్థను స్థాపించి నూలు తీయటం, రాట్నం వడకటం, హిందీ చదవటం, నాటకాలకు తర్ఫీదునివ్వటం మొదలగు కార్యక్రమాలను చేపట్టి ప్రజలను చైతన్యపరిచినారు. రజనీకాంతారావు గారు వ్రాసిన పాటలతో దేవదాసు నాటకం ప్రదర్శించి, మంచి పేరు తెచ్చుకోవడం జరిగింది. గాంధీజీ యిచ్చిన కల్లునిషేధం అను ఉద్యమంలో ఆయన తన 16వ యేటే పాల్గొని, యువకులతో కలిసి కల్లుపాకలలోనికి వెళ్ళి కల్లు కుండలను బద్దలుకొట్టి తీవ్ర నిరసన తెలియజేయడం జరిగింది.

పిఠాపురంలో సోషలిస్టు పార్టీ కార్యాలయాన్ని స్థాపించి జయప్రకాష్ నారాయణ గారిని వారి సతీమణి ప్రభావతి దేవి గారిని తీసుకువచ్చి గొప్ప సభను నిర్వహించడం జరిగింది. పిఠాపురం పట్టణంలో శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయాన్ని స్థాపించి ఎన్నో అభ్యుదయ కార్యక్రాలను నిర్వహించడమే కాకుండా



సదరు గ్రంథాలయం తన కాళ్ళ తను నిలవడానికి అవిశ్రాంతంగా కాలినడకన పిఠాపురం మరియు పరిసర ప్రదేశాలను తిరిగి విరాళాలను సేకరించి గ్రంథాలయం ఎల్లప్పుడూ నడిచేలా ఏర్పాటు చేయడం జరిగింది. ఎంతోమంది యువకులను ఆకర్షించి పుస్తక పఠనం సామాజిక సేవ పట్ల మక్కువ పెంచి ఆయన అనంతరం గ్రంథాలయాన్ని తీర్చిదిద్దే కార్యకర్తలను ఆయన తయారుచేయటం జరిగింది.

మాడభూషి భావనాచార్యులు గారు వీరు గొల్లప్రోలు గ్రామంలో, గోపాలాచార్యులు, కనకమ్మ దంపతులకు జన్మించారు. ఈయన స్వస్థలం సామర్లకోట. అయినప్పటికీ వీరి జీవితం అంతయు పిఠాపురంలోనే గడపటం జరిగింది. ఈయన చిన్నతనం నుండి అభ్యుదయ సోషలిస్ట్ భావాలకు ఆకర్షితులైనారు. గొల్లప్రోలు హైస్కూల్లో 10వ తరగతి వరకు చదువుకున్నారు. ఇంటర్‌మీడియట్ ఆర్.ఆర్.బి.హెచ్.ఆర్. కాలేజీలో చదవటం జరిగింది. అప్పుడు ఆయన ఎ.ఐ.ఎస్.ఎఫ్.లో సభ్యునిగా కాలేజ్ స్టూడెంట్ యూనియన్‌కి నాయకత్వం వహించడం జరిగింది.

ఆయన ఇంటర్ చదువుతుండగా బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా బుర్రకథ దళం సభ్యులుగా జేరి స్వాతంత్రోద్యమానికి ప్రచారం చేస్తుండగా బ్రిటిష్ ప్రభుత్వం ఆయన్ని అరెస్ట్ చేసింది. ఢిల్లీ వద్ద గల ఆలీపూర్ జైల్లో 18నెలల కారగార శిక్ష అనుభవించారు. తరువాత తెలంగాణ సాయుధ పోరాటంలో కమ్యూనిస్టు పార్టీలో చురుకుగా పాల్గొనటం జరిగింది. ఆ సమయంలో ఆయన ఎక్కువ కాలం అజ్ఞాతంలో పని చేయటం జరిగింది. ఆయన్ను పట్టి యిచ్చిన వారికి రూ. 10,000/-లు బహుమతి కూడా ప్రకటించడం జరిగింది.

ఆయన అజ్ఞాతంలో ఉండగానే దామోదర వెంకటరమణమ్మ అను ఆమెను కులాంతర వివాహం చేసుకోవటం జరిగింది. ఈ వివాహాన్ని యిసుగంటి నారాయణ రావు గారు, రావు జగ్గారావు గారు, ఆవంత్స సోమసుందర్ గారు దగ్గరుండి చేయటం జరిగింది.

ఈయన పిఠాపురం కిర్లంపూడి షుగర్ వర్కర్స్ యూనియన్ ఫౌండర్, కాకినాడ స్పిన్నింగ్ మిల్లు వర్కర్స్ యూనియన్ ఫౌండర్ అయివున్నారు. ఈయన రాష్ట్ర చెఱకు

రైతుల సంఘం స్థాపించి దానికి అధ్యక్షులుగా పనిచేసినారు. పిఠాపురంలో ఎన్నో కార్మిక సంఘాలను స్థాపించి కార్మికుల అభివృద్ధికి తోడ్పడటం జరిగింది. వీరు నిరంతరం సాహిత్యాన్ని సిద్ధాంతాన్ని అభ్యసిస్తూ యువకులను ఆకర్షించి భోధించేవారు. వీరు యువకులను స్థిరమైన విద్యను అభ్యసించవలసిందిగా చెప్పేవారు. సదరు క్రమంలో ఏదైనా సహాయం కావలసి వచ్చినట్లు అయితే వారు దగ్గరుండి తీసుకువెళ్ళి సదరు సహకారం లభించేలా చూసేవారు. స్వాతంత్ర్య సమరయోధులకు యిచ్చిన రైల్వే పాస్‌ను ఇలాంటి ఎన్నో మంచి పనులకు ఆయన ఉపయోగించటం జరిగింది.

ఈయన పూనాలో ఎ.సి.సి.సిమ్మెంటు ఫ్యాక్టరీలో పనిచేస్తుండగా యాజమాన్యం అనుమతితో పూనా యూనివర్శిటీలో వేదాలు, రామాయణం, మరియు మహాభారతాలపై పి.హెచ్.డి. చేసినారు. సదరు గ్రంథములలో ఉన్న సామాజిక కోణాలను వివరిస్తూ వ్యాసాలను కూడా వ్రాయడం జరిగింది. ఆయన నిరంతరం గొప్ప గొప్ప వ్యక్తులను కలవటం వారి భావాలను తెలుసుకొని వారితో చర్చించటం సమసమాజమే పరిష్కారం అని వాదించటం జరిగేది. పిఠాపురంలో అనేక మంది యువకులను ప్రముఖులను ఆయన నిత్యం చైతన్యపరిచి సమాజసేవకు పురికొల్పేవారు.

ఆవంత్స సోమసుందర్‌గారు శంఖవరం గ్రామంలో పుట్టి పిఠాపురానికి దత్తత వచ్చారు. వీరి దత్తత తల్లిదండ్రులు ధనవంతులు కావడం వల్ల ఈయన చిన్నప్పటి నుండి గారాబంగాను, సున్నితంగాను పెరగటం జరిగింది. ఈయన కూడా విద్యార్థి దశలోనే ఎ.ఐ.ఎస్.ఎఫ్.లో సభ్యులుగా చేరి స్టూడెంట్ యూనియన్‌కి నాయకత్వం వహించటం జరిగింది. తరువాత కమ్యూనిస్ట్ ఉద్యమంలో చేరి అనేక పోరాటాలను చేయడం జరిగింది. ఆయన చిన్నతనం నుంచి సాహిత్యం పట్ల ఆకర్షితులై కవితలను వ్యాసాలను వ్రాయటం మొదలుపెట్టారు. ఈయన వ్రాసిన వజ్రాయుధం కవితా సంకలనం తెలంగాణ సాయుధ పోరాటంలో సంచలనం సృష్టించింది. ఆ రోజుల్లో ఆ పుస్తకాన్ని నిషేధించటం కూడా జరిగింది.

ఆయన కళాకేళి అను సంస్థను స్థాపించి అనేక పుస్తకాలు వ్రాసి ప్రచురించటం జరిగింది. ఆయన ఎన్నో కవితా సంకలనాలు, వ్యాసాలు వ్రాయటం జరిగింది. సమాజంలో ఏదైనా ముఖ్య సమస్య ఏర్పడినప్పుడు ఆ సమస్యపై స్పందించి వెంటనే



ఏదో ఒక రచన చేసి సమాజం పట్ల ఆయన బాధ్యతను నిర్వహించేవారు. అనేకమంది యువకులను సాహిత్య అభిలాషులుగా తీర్చిదిద్ది తన వారసులుగ కొంతమందిని తయారు చేయటం జరిగింది. పిఠాపురంలో పారిశుధ్య కార్మికుల సంఘం స్థాపించి వారి హక్కుల రక్షణకు ఎన్నో ఉద్యమాలు చేయటం జరిగింది. ఎన్నో భూపోరాటాలు, కార్మిక పోరాటాలు ఆయన చేయటం జరిగింది.

తరువాత ఆయన సోమసుందర్ లిటరరీ ట్రస్టును స్థాపించి ప్రతి సంవత్సరం ఆయన పుట్టిన రోజున కొంతమంది కవులకు సన్మానం చేయటం వారికి బహుమతులు ఇవ్వటం అవార్డులు ఇవ్వటం చేస్తూ మంచి మంచి అభ్యుదయ కవులను ప్రోత్సహించేవారు. దీనికి వారి సొంత డబ్బులు మాత్రమే వినియోగించేవారు.

యువకులతో యువకుడిలా చిన్న పిల్లలతో చిన్నపిల్లాడిలా పెద్దలతో పెద్దవాడిగా ఉండటం ఆయన నైజం. తాను నమ్మిన సిద్ధాంతాన్ని చివరి వరకు నమ్మిన వ్యక్తులలో సోమసుందరం గారు ఒకరు. ఆయన తేది.12-8-2016న మరణించారు.

ఉప్పులూరి సుబ్బారావు గారు పిఠాపురం పట్టణంలో ఉప్పులూరి కామేశ్వరరావు, లక్ష్మీకాంతంలకు తేది.24-11-1924లో జన్మించారు. ఈయన ఆదర్శ కార్మికోద్యమనేత, అమరులు శ్రీ ఉప్పులూరి సుబ్బారావుగారు చివరి వరకు కమ్యూనిస్టు నేతగా విలువలు ఉన్న నాయకులు. ఉప్పులూరి సుబ్బారావు గారు పారిశ్రామిక పెట్టుబడిదారులను గడగడలాడించి, విజయవంతమైన కార్మిక సంఘాలను నిర్మించి పోరాటాలను చేసి కార్మికోద్యమానికి ఎన్నో విలువైన అనుభవాలను అందించారు. శ్రీ ఉప్పులూరి సుబ్బారావు గారు తన యావత్ జీవితాన్ని కమ్యూనిస్టు ఉద్యమానికి కార్మిక ఉద్యమానికి అర్పించి ఆదర్శ కార్మికోద్యమనేత అయ్యారు. సుబ్బారావు గారు తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలోని రాజమండ్రి, కాకినాడ నగరాలలో గోదావరి పేపరుమిల్లు, స్పిన్నింగు మిల్లు, హార్లిక్స్ ఫ్యాక్టరీ, సిటిబస్, ఆర్.టి.సి. కార్మిక సంఘాలను స్థాపించారు.

అలాగే కాకినాడలో గోదావరి ఎరువుల కర్మాగారం, ఆర్.టి.సి.కార్మికులకు సామర్లకోట పిఠాపురం షుగర్స్ యూనియన్ అలాగే పశ్చిమగోదావరి జిల్లాలో కెమికల్స్

మొ॥గు పరిశ్రమల్లో కార్మికులకు నాయకత్వం వహించి అనేక సమ్మె పోరాటాలు నిర్వహించి కార్మిక వర్గానికి ఒక మార్గదర్శి అయి తోడుగా నిలిచారు. ఈయన ఇండియన్ పీపుల్స్ ఫ్రంట్ (ఐ.పి.ఎఫ్) పార్టీకి అధ్యక్షులుగా నాయకత్వం వహించారు. కీ॥శే॥ శ్రీ ఉప్పులూరి సుబ్బారావు గారు స్వతంత్ర కార్మిక సంఘాల సమాఖ్య (ఎఫ్.ఐ.టి.యు) ని స్థాపించి అనేక మంది యువకులకు నాయకత్వ శిక్షణలు ఇవ్వటం వలన అనేక మంది యువకులు యీనాటికీ కార్మిక వర్గానికి నాయకత్వం వహిస్తూ కార్మిక వర్గానికి సేవ చేస్తున్నారు. ఆయన కన్ను మూసే వరకు కార్మిక శ్రేయస్సు కోసమే అహోరాత్రం శ్రమించి తేది. 8-9-1998న అస్తమించారు.

పై నలుగురు నాలుగు స్తంభాలుగా పిఠాపురం పట్టణ అభ్యుదయ అభివృద్ధికి తోడ్పడిన వ్యక్తులు వారికి మనం ఎప్పుడూ కృతజ్ఞతలమై ఉంటాము.

ప్రపంచ కార్మికులార ఏకంకండి....

**– దల్లి శ్రీనివాసరావు**

*(2017 సం॥లో ప్రచురించిన సహృదయ మిత్రమండలి సావనీర్ 'సహృదీయం' నుండి ఈ వ్యాసం తీసుకోవడమైనది)*

* * * *



# ఏకవ్యక్తి సైన్యం



## మేకా సత్యనారాయణశాస్త్రి

**(కీ॥శే॥ బాంబు ప్రథమ వర్ధంతి స్మారక జ్ఞాపిక)**



కీ॥శే॥ మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) ప్రథమ వర్ధంతి సందర్భంగా సత్యనారాయణ శాస్త్రి స్మారక వేదిక పిఠాపురం ముద్రించిన ఏకవ్యక్తి సైన్యం సత్యనారాయణశాస్త్రి గ్రంథం విభిన్న రంగాలకు చెందిన విజ్ఞుల అభిప్రాయాలు, బాంబు సామాజిక మాధ్యమాల రచనలు ఆయన రాసిన ఉద్యమ కరపత్రాలు, ఆయన చేసిన అనితరసాధ్యమైన ఉద్యమాలు, వార్తాపత్రికలు, దాదాపు వంద వరకూ అరుదైన కుటుంబ చిత్రాలతో ఆయనతో ఏమాత్రం సంబంధం కలిగి ఉన్న వ్యక్తులూ అలాగే పిఠాపురం భావోద్యమాలతో బాంధవ్యం గల ఆలోచనాపరులూ భద్రపర్చుకుని తీరాల్సిన విలువైన జ్ఞాపికగా రూపొందింది!

బంధుమిత్రులు, కుటుంబ సభ్యుల ఫోటోలు మాత్రమే కాక రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా అంతమంది అభిప్రాయాల్ని సేకరించడం, వాటన్నింట్నీ సరైనపద్ధతిలో విభజించి పొందుపర్చడం, ఎన్నడో రాసిన బాంబు రచనల నుండి మొదలెడితే ఆయన కుటుంబ సమేతంగా చేసుకున్న కార్యక్రమాలు, ప్రజాహిత నిరాహార దీక్షలు, చేసిన పోరాటాలు, అన్నింటికీ ఒక సుస్థిరమైన స్థానం కల్పించడమే లక్ష్యంగా ఈ సంకలనం. ఒక ఆశ్చర్యకరమైన గ్రంథంగా రూపొందింది. ఎవరొప్పుకున్నా లేకపోయినా చరిత్ర నమోదు చేసిన రికార్డిది!

అంతటి మహత్కార్యంలో మాతో పాటు మీరు కూడా భాగస్వాములైనందుకు మీకు ప్రత్యేక ధన్యవాదాలు. కీ॥శే॥ మేకా సత్యనారాయణశాస్త్రి (బాంబు) స్మారక వేదిక సగర్వంగా, నభూతోనభవిష్యతి అన్న రీతిలో జిల్లాలో సంగతలా ఉంచి అసలు తెలుగులోనే ఇప్పటి వరకు రాని విధంగా ఒక తండ్రిగా, పాత్రికేయుడిగా, తిరుగుబాటుదారుగా, ప్రజా కార్యకర్తగా, సత్యాన్వేషిగా కృషి చేసిన బాంబు అంతరాత్మని అక్షరాల్లో ఆవిష్కరించడం జరిగిందనీ, స్మారక సంకలనం చదివిన ప్రతి ఒక్కరూ ఫోన్ చేసి పదే పదే అభినందించడం ఎంతో ప్రోత్సాహకరం!

ఎన్నో ప్రజాహిత స్రవంతులో ప్రవహించిన తొంభై సంవత్సరాల పెద్దాయన, మానవవాహిణి స్థాపకులు గరిమెళ్ళ నారాయణగారు ముంబాయి నుండి, విజ్ఞాన వేదిక నాయకులు డా॥ చెలికాని స్టాలిన్, రామచంద్రాపురం, సామాజిక కార్యశీలి జయరావు గారు, గుంటూరు జిల్లా భట్టిప్రోలు నుండీ, కందాళ సుబ్రహ్మణ్య తిలక్ ఫౌండేషన్, విజయనగరం నుండి వచ్చిన పెద్దసాయి, విజయ తదితరులు, విశాఖపట్నం నుండి ప్రత్యేకంగా కార్యక్రమం కోసమే విచ్చేసి తన కోల్‌కత్తా ప్రయాణాన్ని సాయంత్రానికి వాయిదా వేసిన శంకర్, ఇంకా తిరుపతి నుండి కుటుంబ సమేతంగా విచ్చేసిన దిలీప్ శరణ్య, రిషీకేశ్, రాయపూర్ నుండి వచ్చిన పదిమంది బంధుమిత్రులు, ఇంకా చుట్టు ప్రక్కల విశాఖపట్నం, రాజమహేంద్రవరం, కాకినాడ తదితర ప్రాంతాలవారు, స్థానిక శ్రేయోభిలాషుల సారధ్యంలో జరిగిన ఈ నివాళి కార్యక్రమం నిజంగా ఒక అపురూపం!

ఒక వ్యక్తి గతించిన ఏడాది కాలంలో ఆయన స్మారక చిహ్నంగా పది విశిష్ట ప్రచురణలు తీసుకురావడం, అలాగే ఆయన జీవితానికి సంబంధించిన అనే విషయాల్ని సంగ్రహించి విలువలతో కూడిన జీవన గమనానికి ప్రతీకగా అద్భుతమైన వ్యాస సంకలనం ప్రచురించడం నిజంగానే అరుదైన సంఘటనగా హితులు పేర్కొన్నారు సంతోషం!

అందులో భాగంగా ఒక ఉన్నతమైన పౌర సమాజం కోసం, ఉత్తమమైన మానవీయ ప్రస్థానం కోసం తనకున్న పరిమితులలోనే అనునిత్యం అనితరసాధ్యమైన కృషి చేసి, మరణాంతరం కూడా తన కళ్ళనీ, దేహాన్నీ ఇతరుల కోసమే ఇచ్చేసిన ఆయన నిఖార్సైన ఆచరణవాది. ఆయన స్ఫూర్తితో రూపొందిన ఈ చిన్న గ్రంథాన్ని చదివాక మీ అంగీకారాల్ని, భిన్నాభిప్రాయాల్ని తప్పనిసరిగా తెలియజేస్తే భవిష్యత్తులో మా ఇతరేతర సమాజహిత కార్యక్రమాల రూపకల్పనకి నిర్మాణాత్మక చేయూత ఇచ్చినవారౌతారని మనవి. కాన, చదివి మీ అభిప్రాయాలతో స్పందించాల్సిందిగా కోరుతూ, విమర్శలకి ఆహ్వానం!

ఇట్లు
సత్యనారాయణ శాస్త్రి స్మారక వేదిక
పిఠాపురం, కాకినాడ జిల్లా
***(ఎఫ్.బి.నుండి తీసుకున్న వ్యాసం)***

* * * *



# ఆయన మార్గం మానవతావాదం

## సత్యనారాయణ శాస్త్రి (బాంబు)

**ప్రథమ వర్ధంతి సమావేశం నివాళి**



పిఠాపురంలోని నివాస గృహంలో వంద మందికి పై చిలుకు వివిధ ప్రాంతాల నుండి విచ్చేసిన మిత్రులు, కుటుంబ శ్రేయోభిలాషుల సమక్షంలో సత్యనారాయణశాస్త్రి (బాంబు) ప్రథమ వర్ధంతి ఎప్పుడూ వెన్నంటి ఉండే స్థానిక మిత్రులు రాజు, సుధాకర్, రాజా కరీంల ఆధ్వర్యంలో ఇతర స్నేహితుల ప్రోత్సాహంతో అసలు ఏమాత్రం ముందుగా సమావేశం అనుకోనప్పటికీ చాలా అబ్బురంగా నిరాడంబరంగా జరిగింది!

ముంబాయి నుండి పెద్దలు ఎన్నో ఉద్యమాల్లో భాగస్వామి నిరంతర సంచారి మానవ వాహిణి గరిమెళ్ళ నారాయణ గారి నుండి గుంటూరు నుండి వచ్చిన జయరావు వరకూ తిరుపతి నుండి కుటుంబ సమేతంగా వచ్చిన మిత్రుడు దిలీప్, శరణ్యల నుండి విజయనగరం కె.యస్.ఫౌండేషన్ తరపున విచ్చేసిన పెద్దసాయి తదితరుల వరకూ అటు శ్రీకాకుళం నుండి ఇటు రాజమండ్రి దాకా ఛత్తీస్‌గఢ్, రాయపూర్ నుంచి పదుల సంఖ్యలో అభిమానంగా విచ్చేసిన అందరికీ పేరుపేరునా ధన్యవాదాలు.

జన విజ్ఞాన వేదిక డా॥ చెలికాని స్టాలిన్, కళ్యాణి, సోమసుందర్ లిటరరీ ట్రస్ట్ మన్మధరావు, సహృదయ మిత్రమండలి సతీష్, అప్పారావుగారు, మద్యపాన వ్యతిరేక సమితి నానిబాబు, సూర్యనారాయణ, జాహ్నవి సాంస్కృతిక సంస్థ కృష్ణారావు, త్రిమూర్తులు, సూర్యరాయ విద్యానంద లైబ్రరీ కొండేపూడి శంకరరావు, మన ఊరు మన బాధ్యత నగేష్, ఫ్రెండ్స్ న్యూస్ ఏజెన్సీ స్టాలిన్, జర్నలిస్టు దత్తు, పురూహూతికా లలిత కళాపరిషత్ సి.సి.ఆర్.టి.ప్రసాద్, మాదేటిరాజాజీ మెమోరియల్ రవి ప్రకాష్ అడుగుజాడ ప్రచురణల రవికాంత్ తదితరుల ఆత్మీయంగా పాల్గొన్నారు.

సత్యనారాయణ శాస్త్రి (బాంబు) జీవితం, కృషికీ సంబంధించి విలువైన సమాచారంతో సంకలనం చేసిన ఏకవ్యక్తి సైన్యం పుస్తక ఆవిష్కరణ కూడా జరిగింది. సత్యనారాయణ జీవితం గురించి సామాన్య పాత్రికేయుడిగా పనిచేస్తూనే ఎన్నో అసామాన్య కార్యక్రమాల రూపకల్పన చేసిన ఆయన అసమాన ప్రతిభ గురించి క్లుప్తంగా మాట్లాడిన వ్యక్తులు ఈ రోజు ఆ ప్రశ్నించేతత్వాన్ని నిర్భయతను కాపాడుకోవడం అవసరం అన్నారు.

ఒక్క ఏడాది కాలంలో వేదిక తీసుకుని వచ్చిన విశిష్టమైన విభిన్న అనువాదాల్ని, సంకలనాల్ని భోజనాల అనంతరం అహుతులందరికీ మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక తరపున అందజేయడం జరిగింది. ఇంకా సభలో పాల్గొని సత్యనారాయణగారితో అనుబంధాన్ని ఆత్మీయంగా గుర్తు చేసుకుని నాన్నకి నివాళి అర్పించిన ఇంకా అనేకమంది శ్రేయోభిలాషులు ఇక్కడ పేర్లు ప్రస్తావించని ఆత్మీయులు అందరికీ మరొక్కసారి ప్రేమపూర్వక నమస్సులు.

*(ముందుగా ఖచ్చితంగా వస్తామని చెప్పి కూడా పత్తాలేని చుట్టాలు కొద్దిమంది ఇంకా చివరి క్షణంలో వ్యక్తిగత కారణాల వల్ల కార్యక్రమానికి రాలేకపోయిన శ్రేయోభిలాషులు హిందూపూర్ విద్యాసాగర్ కడప రఘు వంటివారు కూడా ఉన్నప్పటికీ మొత్తంగా అనుకున్నదానికన్నా చాలా బాగా సమావేశం జరగడానికి సహకరించిన టీంకు ప్రత్యేక ధన్యవాదాలతో ఈ చిన్న రైటప్)*

***(ఎఫ్.బి.నుండి తీసుకున్న వ్యాసం)***

* * * *



**శతవసంతాల వైజ్ఞానిక చారిత్రక నిలయం**

# శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయం

ఒకనాడు కాకినాడ జిల్లాలోని పిఠాపురం సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ కేంద్రం సంఘ సంస్కరణ మొదలుకొని స్వాతంత్ర్య సమరం వరకూ ప్రతీ ఉద్యమానికి దిక్సూచి. ఎందరో మహానుభావులు గుర్తింపు పొందిన నేల. మరెందరో బుద్ధిజీవుల ఉన్నతికి అవకాశం ఇచ్చిన ప్రదేశం. గాంధేయవాదం, బ్రాహ్మసమాజం, ఆధ్యాత్మికం, సోషలిజం కలగలిసి భాసించిన విశిష్టమైన భూమి. వీటన్నింటినీ తనతో పాటు ఇముడ్చుకున్న అపూర్వ నిలయం శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయం.

ఉభయ తెలుగు రాష్ట్రాలలో ఘన చరిత్ర గల సామాజిక గ్రంథాలయం. 1915లో పట్టణంలో కొద్దిమంది యువకులు కలిసి విద్యానంద లైబ్రరీ స్థాపించారు. 1916లో మరికొందరు సూర్యారాయ లైబ్రరీని పెట్టుకున్నారు. మొదట్లో రెండుగా ఉన్న ఈ గ్రంథాలయాలు, ప్రజా సంక్షేమం కోసం కలిసి సమైక్యంగా ఉండడమే సమాజ పురోగతికి మేలని తలచి 1922లో "శ్రీ సూర్యారాయ విద్యానంద గ్రంథాలయం" గా ఏర్పడటం ఒక చారిత్రక ప్రాధాన్యత కలిగిన సంఘటన. ఆ విధంగా ఈ లైబ్రరీకి ఇది శత వార్షికోత్సవ సంవత్సరం.

విలక్షణమైన ప్రజామోదకుడిగా పేరొందిన మహరాజా శ్రీ రావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహదూర్ గారు, గ్రంథాలయ పితామహులైన అయ్యంకి వెంకటరమణయ్య, అలాగే గాడిచర్ల హరిసర్వోత్తమరావు మొదలైన మహామహులు ఈ గ్రంథాలయ వికాసానికి ఎనలేని కృషి చేసినవారు. అయితే, ఈ రోజు గ్రంథాలయం ఈ విధంగా ప్రజానీకానికే కాక రాష్ట్ర వ్యాప్తంగా అనేక మంది పరిశోధకులకి, రచయితలకు, మేధావులకు అందుబాటులోకి రావడానికి అహర్నిశలూ శ్రమించిన వారు మహా నాయకులు సోషలిస్టు కీ॥శే॥ చెలికాని భావనరావు గారు.

ఇక్కడే దేవులపల్లి కృష్ణశాస్త్రి, తాపీ ధర్మారావు, పానుగంటి లక్ష్మి నరసింహారావు, మొక్కపాటి నరసింహమూర్తి, వెంకట పార్వతీశ కవులు, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, దాసరి లక్ష్మణ కవి, బాలాంత్రపు రజనీకాంతరావు, ఆవంత్స సోమసుందర్ వంటివారు సాహిత్యంలో శిఖరాలను అందుకున్నారు. ఇక నేదునూరి కృష్ణమూర్తి , తాపరాడ సంగమేశ్వరశాస్త్రి, చిట్టిబాబు, పెండ్యాల సత్యభామ వంటి సంగీత విద్వాంసులు మరెందరో అరుదైన రచయితుల, పండితులు, విద్యావేత్తలు, కళాకారులు ఉన్నారు.

ఈ గ్రంథాలయం ఎన్నెన్నో చారిత్రక సభలూ, సమావేశాలు, కవితా గోష్టులకి సజీవ సాక్ష్యం.

కోడి రామ్మూర్తినాయుడు, విశ్వనాథ సత్యనారాయణ, సి.నారాయణరెడ్డి, ఆరుద్ర, మధునాపంతుల సత్యనారాయణ, మల్లంపల్లి సోమశేఖరశర్మ వంటి ఉద్దండుల్ని, ఆహ్వానించి ఎన్నో ఘనమైన కార్యక్రమాలకి రూపకల్పన చేసిన ఈ గ్రంథాలయానికి 1975లో కన్నులపండువగా వజ్రోత్సవ వేడకలు జరిగాయి. అలాగే 2015లో శతవార్షికోత్సవ వేడుకలు వైభవంగా జరిగాయ్. గ్రంథాలయానికి వదాన్యుల ప్రోత్సాహంతో మంచి భవనమూ, సమావేశ మందిరం, పోటీ పరీక్షల విభాగం కూడా ఏర్పడ్డాయి.

ఇంతటి ఘనచరిత్ర కలిగిన గ్రంథాలయాన్ని యువతకు మరింత చేరువ చేయడం ఈనాటి కర్తవ్యం కావాలి. సాహిత్యం పట్లా, సామాజిక స్పృహ పట్లా ఆసక్తి కలిగించడం వలనే అది సాధ్యం. విలువైన గ్రంథాల్ని భద్రపరుచుకోవడం ఒకెత్తయితే, గ్రంథాల్లోని విలువల్ని జీవితానికి అన్వయించుకోవడం మరొకెత్తు, మంచి సాహిత్యం యొక్క ఉద్దేశం ఇదే. మనిషిని మనిషిగా మలచడం, అందుకే ఆలయాల్లోని ఆధ్యాత్మిక దైవికతకి ఎంత ప్రాధాన్యత ఇచ్చారో, గ్రంథాలయాలు నిర్వర్తించాల్సిన ఆత్మికమైన మానవతకి కూడా ఆనాడు అంతే ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది.

విరుద్ధ శక్తుల సంఘర్షణ కొత్త ప్రగతికి వెలుగు చూపుతుందని చరిత్ర. ఆ సూత్రం ప్రకారమే రెండు వేరు వేరు వర్గాలు కలిసి ఏర్పాటు చేసుకున్న లైబ్రరీలు రెండూ అవినాభావంగా ఐక్యమై మహత్తరమైన వైజ్ఞానిక వ్యవస్థగా వందేళ్ళు విజయవంతంగా ముందుకు సాగడం నిజంగా తెలుగు గ్రంథాలయోద్యమ చరిత్రలో, అంతకుమించి సాంస్కృతికోద్యమ ప్రగతిలో తప్పనిసరిగా అత్యంత ముఖ్యమైన విజయం. అందుకు కారణమైన నాటి మహానాయకులు, అలాగే నేటి కార్యనిర్వాహక వర్గం అందరికీ అభినందనలు తెలుపుతూ, అఖండమైన ఈ అక్షర భాండాగారం భావితరాలకు మరిన్ని ఆదర్శవంతమైన కాంతులు వెదజల్లాలని కోరుకుంటూ సెలవు.

(పిఠాపురం శ్రీ సూర్యారావు విద్యానంద గ్రంథాలయం అవిభాజ్యంగా ఏర్పడి నూరేళ్ళు పూర్తయిన శుభసందర్భంగా)

– గౌరవ్, పిఠాపురం పీపుల్స్ ఇనీషియేటివ్

(ఆంధ్రజ్యోతి దినపత్రిక నుండి ఈ వ్యాసం తీసుకోవడమైనది)



## గౌరవ్ ఇతర ప్రచురణలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి ?
3. సాంఘిక తత్వం – వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్థిత్వం – అరాజకత్వం
7. మద్యం పై యుద్ధం
8. మతానికి మరణశాసనం...
9. కరపత్రాల కథా కమామీషు
10. తత్వ విచారణ : తర్క వివేచన
11. కులానికో సవాలు
12. హేతువాద దృక్పథం: విధానపర కర్తవ్యం
13. కలాలు – కరపత్రాలు
14. ప్రకృతి – శాస్త్రం – సమాజం
15. పార్టీరహిత ప్రజాస్వామ్యం
16. శిథిలాక్షరం
17. వ్యవస్థలు – వ్యసనాలు
18. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
19. తరగతిగది తత్వశాస్త్రం
20. అభివ్యక్తి
21. భారతదేశ పతనానికి ప్రధాన కారణం:కులం
22. మహా మానవవాద తత్వవేత్త – మానవేంద్రనాథ రాయ్

## ఇంటర్వ్యూలు – పరచయాలు

23. ధిక్కార స్వరాలు (భావోద్యమకారుల ఇంటర్వ్యూలు)
24. విస్మృత స్వరాలు (గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)
25. సద్ధమ్మ స్వరాలు (బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)

26. దీరోధాత్తులు (కొద్దిమంది సామాజిక కార్యకర్తల పరిచయాలు)
27. సాఫల్య జీవులు (మహానుభావుల పై ప్రసంగ వ్యాసాలు)
28. మరువలేని మనుషులు:మరపురాని జ్ఞాపకాలు (కొందరు గతించిన ఆత్మీయుల స్మృతులు)
29. రాజీలేని ధిక్కార పతాకాలు (కొద్దిమంది సామ్యవాదుల పరిచయాలు)

## అనువాదాలు - అనుసరణలు

30. నీటిమరల గ్రామం (అకిరా కురుసోవా విలేజ్ ఆఫ్ వాటర్మిల్స్ కి తెలుగు అక్షర రూపం)
31. పురుషుడు – స్త్రీ (చలం ఏకైక ఆంగ్ల వ్యాసం తెలుగులో)
32. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా.. (లోక్నాయక్ జయప్రకాశ్ నారాయణ్ వ్యాసం )
33. శాస్త్రీయ హేతువాద సామ్యవాది : వివేకానంద (దత్తప్రసాద్ దభోల్కర్ రచన అనువాదం)
34. సాలీడు – ఈగ (విలియం లబ్నిష్క్ పిల్లల కథ తెలుగులో)
35. నంది మూపురం (డి.డి.కొశాంబి పిల్లల కథ తెలుగులో)
36. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో.. (విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ కవితా విశ్లేషణ)
37. చారిత్రక మహోద్యమం : చంపారన్ సత్యాగ్రహం (చంపారన్ శతవార్షికోత్సవ వ్యాసాలు)
38. సాంస్కృతిక ఆవశ్యకతగా స్వేచ్ఛ (యం. యన్. రాయ్ వ్యాసం తెలుగులో)
39. మన విద్యా సమస్య (లాలా లజపతిరాయ్ వ్యాసం)
40. జీవితానికి అర్థం ఏమిటి ? (ఆచార్య నరేంద్రదేవ్, లోహియా వ్యాసాలు)
41. ప్రకృతి శాశ్వత ప్రగతి (సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ)
42. అభివృద్ధి – ఆదివాసులు – హింస (హిమంశుకుమార్ హిందీ రచన తెలుగులో)



43. మనిషి – మార్జాలం (కానర్డ్ లోర్నెంజ్ పిల్లి కథ)
44. సినిమా కార్యకర్తల కరదీపిక (ఏ మాన్యువల్ ఫర్ ఫిల్మ్ స్క్రీనింగ్ తెలుగులో)
45. నేను – ప్రజలు – ప్రపంచం (పిఠాపురం యువరాజా ఆత్మకథ తెలుగులో)
46. భారతదేశంలో బౌద్ధ పతనం (అంబేద్కర్, రాహుల్జీ ల వ్యాసాలు)
47. అనారోగ్యాన్ని పండగ చేసుకుందాం (తమిళ నమ్మల్వార్ రచన అనువాదం)
48. భారతదేశ విముక్తి మార్గం: బౌద్ధం (డా.బి.ఆర్.అంబేద్కర్ ఐదు బౌద్ధ ప్రసంగాలు)
49. పర్యావరణ పరిరక్షణ (సుందర్లాల్ బహుగుణ రచన)
50. మన కర్తవ్య మార్గం (గదర్ వీరుడు సోహన్ సింగ్ భాక్నా రచన)
51. సైన్స్ అంటే ఏమిటి ? (వినోద్ రైనా, డి.పి. సింగ్ రచన తెలుగులో)
52. ఆర్.వి.కె.యం.సూర్యారావు బహదూర్ (పిఠాపురం మహారాజా జీవినచక్రం)
53. మహాత్మాగాంధీ (ప్రొ. సచ్చిదానంద సిన్హా వ్యాసం తెలుగులో)
54. ప్రజాపక్ష మేధావి కొశాంబి (అరవింద్ గుప్తా రచన తెలుగులో)
55. నాకో భార్య కావాలి ! (అమెరికన్ స్త్రీవాద రచయిత్రి జడీబ్రాడీ వ్యంగ్య రచన తెలుగులో)

## సేకరణ - కూర్పు - పునర్ముద్రణ

56. ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంస్కర్తలు – శతవార్షికోత్సవ సందర్భం (పి. హెచ్. గుప్తా గారి వ్యాసం )
57. కాకినాడలో ఒక సాంఘిక సంస్కరణ – శతవార్షిక సమాలోచన (యలమంచిలి వెంకటప్పయ్య గారి వ్యాసం)

## పర్యవేక్షక/ భాగస్వామ్య ప్రచురణలు :

58. అద్వితీయ వైజ్ఞానికవేత్త, కీ. శే. యాళ్ళ సూర్యనారాయణ (పార్వతీపురం) విశిష్ట కృషి :భావ దీపికలు (నాస్తిక, హేతువాద, భౌతికవాద సూక్తులు)
59. మైత్రేయి బుద్ధవిహార మహానిర్మాత, మహా దయ యాజరా రచనా సంపుటి : నన్ను నేను ప్రకటించుకుంటున్నా !
60. రేపటి తరం కోసం మద్యపాన వ్యతిరేక ఉద్యమం (జనవిజ్ఞాన వేదిక ముద్రణ)
61. కులనిర్మూలన కై గళమెత్తిన సదస్సు !
62. ఏకవ్యక్తి సైన్యం : మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)

## సంకలనం - సంపాదకత్వం

63. మద్యపానమా? మానవత్వమా?
64. మానవతకు భరోసా
65. సహృదీయం
66. పేదల కలలు (కథలు)
67. సంస్కృతి:సంక్షోభాలు–సంవాదాలు
68. ప్రత్యామ్నాయ సినిమాలు : దృక్పథాలు – దృక్కోణాలు
69. మానవీయ ఆసరా స్వరాలు...
70. భారతదేశ ప్రజలమైన మేము..
    (డెబ్బై ఏళ్ళ రాజ్యాంగ విశ్లేషణ వ్యాసాలు)
71. చదువు అంటే ఏమిటి, చదువులెందుకు?
72. ప్రజలు – కళలు
73. భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం
74. నవభారత యువదిక్సూచి భగత్సింగ్
75. కులనిర్మూలన కోసం...
76. పరాయీకరణ :పరిణామాలు – పర్యవసానాలు
77. శ్రమైక జీవన సంస్కృతి
78. ఒకే వ్యక్తి – అనేక జీవితాలు
    (రాహుల్జీ పై వ్యాస సంకలనం)
79. మద్యమా ? మానవ మనుగడా?
    (మద్య వ్యతిరేక కరపత్రాలు)
80. ప్రజల కోసం పాత్రికేయం : ప్రమాణాలు – ప్రభావాలు